శ్రీ

# పాంథస్వప్నము.

ఇది

## తల్లాప్రగడ సూర్యనారాయణగారిచే

రచియింపఁబడి

సువర్ణలేఖాపత్రికకునంపి

డి. వి. రమణారావుగారిచే

---

త ౯ ౧.

శ్రీ సౌదామినీముద్రాక్షరశాలలో
ముద్రింపఁబడి సువర్ణలేఖాపత్రికాధిపతిచేఁ
బ్రకటింపఁబడియె.

1910

---

 వెల రు 0—1—0 

# పాంథస్వప్నము.

---:o:---

## ప్రథమప్రకరణము.

---

పాంథుఁడొకఁ డొంటరిగ గాంధారదేశంబున నరణ్యంబులంబడి పోవుచున్న వాఁడు. మధ్యాహ్నమైనది. ఎండవేఁడిమి మిక్కుటముగా నుండెను. పాంథుఁ డలసెను. అంతసెలయేఱొకటి తారసిల్లెను. ప్రక్కను జిట్టడవి చీమకడములేకుండఁ బెఱిగియున్నది. సెలయేటి మరమరశబ్దంబా పొదలసందులనుండి ప్రతిధ్వనించుచుండెను. మనపాంథుఁడు సేదదేర్చుకొనుటకై యాయేటిదరిని కూర్చుండి తనగుఱ్ఱమును దత్తీర భూమింగల శాద్వల ప్రదేశంబున నవనవలాడు లేఁబచ్చికపై మేఁతకై వదలెను. చుటు నేమూలఁ జూచినను నయోమయముగా నున్నది. కాని హృదయంగమంబుగనుండెను. అరణ్యంబు దుర్గమంబై సూర్యకిరణంబులకైన భేదింప నశక్యంబుగ నున్నది. అచ్చటచ్చట బొగ్గులకని కొందఱు వంటచెఱకునకని కొందఱును మాత్రమాయరణ్యమును భేదించిరి. అట్టిప్రదేశములైన నంత విశేషముగ లేవు. అందుకొన్ని చెట్లత్యున్నతముగఁ బెఱిగి యాయరణ్యమున కంతకు నుత్కృష్టపదవి కల్పించుచుండెను. కొన్నిచెట్లు నూటముప్పది యడుగుల యెత్తువఱకును బెఱిగియుండెను. మొదలిరువది గజములవఱకును చిన్న కొమ్మగాని పలవగాని ఈషణ్మాత్రముచివురుగాని బయలుదేరలేదు. వంపుటొంపులేకనూటిగబయలుదేరి తారాపథంబు నొరయుచు నద్భుతస్తంభంబు మాదిరి నొప్పుచుండెను. తదుపరిభాగమున పర్ణసముదాయంబు విస్తీర్ణమై ఛాందినీ ననుకరించెను. దాని క్రింద విశ్రమించు వన్యగజంబులా చెట్టునున్నతితోఁ బోల్చిచూచునప్పుడు సామాన్యజంతువులవలెఁ గాన్పించును.

మనుష్యసంచారంబున కెడమైయుండు నిట్టియారణ్యక నిగూఢప్రదేశంబుల, దూరస్థంబుగనుండు పర్వతశిఖరంబులఁ బ్రకృతి తనసహజసౌందర్యంబున విలసిల్ల గంభీర భావంబు వర్ధిల్లుచుండును. చుట్టుపట్టుల విలసిల్లు శబ్దరాహిత్యము. మనుష్యసంచారంబుగాని మనుష్యసంభాషణంబుగాని యొక్కింతయు లేక గాంభీర్యముగనున్న ప్రదేశ విశ్రాంతి. తత్ప్రదేశప్రవర్ధితవస్తువర్ణనసంజనితమహావైభవంబు. ఇవియొకదాని కొకటి సాయమగుచుండెను. అనంతుండును సర్వోత్కృష్టుండునగు ప్రపంచాధీశ్వరుని భక్తిపూర్వకంబుగ నారాధించుటకియ్యవి మనస్సును బురికొల్పుచు నాత్మాభివృద్ధిం జేయక మానవు. మనపథికుని యవస్థకష్టతరంబుగనే యుండినను నాతని మనం

మున కియ్యది యొక్కింత వికాసము కలిగించి వాని హృదయంబునఁ బుణ్యాలోచనలు కొన్ని కలిగించెను. తనయెట్టయెదుట బుడబుడ శబ్దించుచున్న యా సెలయేరువంక స్తిమితముగఁ జూచుచు కూర్చుండి యుండెను. అవశాత్తుగ దగ్గఱనున్న పొదలు కదలి యాతనినిశ్చలత యొసల్చెను. తోడ్తోన పెద్దబొబ్బరింత వినఁబడియెను. ఇక నొక్క నిమిషములోఁ బెద్దసింహ మొకటివచ్చి యాతని గుఱ్ఱమును గ్రిందఁ గూల్చెను. పాంథుఁడు తనకూర్చుండిన చోటనుండి లేచి యొరనుంచి కత్తిదూసెను. ఆభయంకర మృగము వెనుకకుఁ బోయి యాతడు దాని వెనుక కాలు తన కఱకు కరవాలంబున కోఱఁ జేసెను. ఆమృగవిభుండు వెనుకకు మరలుఁ లోపలఁ దనఖడ్గంబు మరలఁ బ్రయోగించి వానిని మరల లేవలేకుండఁ జేసెను. అంత నావన్యమృగంబు తన యాహారపదార్థంబును దన పట్టునుండి విడిచెనుగాని యాగుఱ్ఱమునకుఁ దగిలిన దెబ్బ మిక్కిలి గాఢముగఁ దగిలెను. రక్తప్రవాహము వరదపొల్లువలె బయలుదేరెను. నిరపరాధినియగు నాయశ్వము యొడ్డునఁబడి పొరలుచు మరణయాతనఁ బొందుచుండెను. ప్రచండక్రోధాతిరేకంబున సింహము బొబ్బరించుచుండెను. కన్నులు కణకణలాడుచుఁ జింతనిప్పులవలె మెఱయుచుండెను. కేసరములు నిక్కి నిలిచెను. కాని తన యుపకృతికిఁ దగిన ప్రతీకారము సెయ నసమర్థమై యుండెను. ఎట్టులైన నాకసిదీర్చికొనవలయునని యెంచి ముందుకాళ్ళు చాచెనుగాని యయ్యది నిష్ఫలప్రయత్నంబయ్యెను. అవశ్యండగు నాపాంథుఁడు నిర్భయముగ సమీపించెను. తన కరవాలంబున దాని శిరంబు తుండెతుండెముగ ఖండించుచు మరలమరల మోదుచుఁ జంపిపడవైచెను.

గుఱ్ఱము చచ్చిపోవునని యాతఁడు కలనైననెఱుంగఁడు. అరణ్యమున నాతఁడిప్పుడు కాలినడకను బోవలయును. అప్పటికిఁ బ్రొద్దుచాలఁ దక్కువగనున్నది. ఇంక నాలస్యము చేయకుండ బయలుదేరిపోవఁ గృతనిశ్చయుండయ్యెను. అంతకుమున్న గుఱ్ఱపుజీనునకు సంచియొకటి వ్రేలాడఁగట్టికొనివచ్చెను. దానిందీసి యిప్పుడు తనచంకను దగిలించుకొనియెను. ఆతఁడు చేయవలసిన ప్రయాణము చాలదూరము. కష్టము హెచ్చు. వెలుపలికి బయలుదేరివచ్చెను. అచ్చటనొక యాఁడులేఁడియును దానిపిల్లయును కానిపించినవి. పిల్లయప్పుడే పుట్టినది. ఆతనిరాకకుజడిసి తల్లిలేఁడి పాఱిపోయినది. పాంథుఁడు పిల్లదొరికినందులకు సంతసించి దానికాళ్లు కదియఁగట్టి చంకను దగిలించుకొని దారింబడి పోవుచుండెను.

తెరపిగానున్న ప్రదేశము దాఁటెను. మరల దట్టమగు నడవిలోఁ బడియెను. ఆఁకలి బాధదీర్చికొనుటకుఁ గొంచెమేదియో సేకరించుకొని యారాత్రియంతయును నాతఁడడవిలోఁ గడుపవలసియుండెను. పోయిపోయి యొక్కయెడ వంటఁ జేసికొనుటకుఁ

దగ్గఱప్రదేశముఁ గాంచి యచ్చట విడిసెను. ఎండిపోయిన చెట్టు మొదట నొకచోట తన లేడిపిల్లను దింపి రెండెండు కట్టెలను మధించి నిప్పుచేసికొని యంతట నీమృగశాబకమును చిత్రవధ సేయ సన్నద్ధుఁడయ్యెను. కానికొంచెము దూరమున నిలుచుండి యతిదుఃఖాకులాత్మయై చూచెడు తల్లి లేడిం గాంచి యాతఁ డొక్కింత విరతి వహించెను. కన్నులనుండియా గూఁడు లేడికిఁ గన్నీరు జలజల కపోలతలంబుపై జారిపడుచుండెను. శిరస్సుపైకెత్తెను. కన్నులొక్కసారి తెరచి దీనముగ నాపాంథునివైపు చూచుచుండెను. ఒక్కసారి చచ్చువఱ కటు బాధింపఁ జేయుచున్న నిరపరాధినియగు తనవత్సంబుపై కరుగుచుండెను. అనుభవింపనున్న యాపద యేమో పాపమిది యెఱుఁగదు. ఇంకను పల్లికొలఁకు బ్రాకులాడుచుండెను. క్రమక్రమముగ దగ్గఱ లేడి సాహసించి పాంథుఁడు నిలిచియుండు ప్రదేశం [illegible] ఆతఁడును కొన్నియడుగులు వెనుకకు జరిగెను. అత్యాతురముగ నాతల్లి పరుగుపరుగునఁ దనవత్సము దగ్గఱ కరిగెను. దానిఁ గౌఁగిలించుకొనుచుండెను. [illegible]ంబున నతివాత్సల్యంబున దాని ముద్దులాడెను. పథికుఁడు సమీపించుసరికి [illegible] విడిచిపెట్టెను. కానికొంచెము దూరముగ నిలువఁబడి యుండెను. [illegible]శము. మాతృవాత్సల్యముయొక్క యనుబంధప్రాబల్యము దాని మొగమున విదితమగుచుండెను.

అది చూచిన నెట్టివానిదైనను హృదయము కరఁగకమానదు. మానవహృదయమును కరంచుటకింతకంటె వేఱుమార్గము లేదు. మనపథికుని హృదయము కరఁగినది. జాలిపుట్టినది. భూతదయ యుదయించినది. ఒక్కసారిగఁ బరమపవిత్రమై యత్యుత్కృష్టమై ప్రేరితంబగు నావేశ మొకటి యావరించినది. అంత నాహరిణశాబకమును బంధమోక్షణము గావించెను. ఆ పసుంగు పరుగుపరుగునఁ దనతల్లియొద్దకరిగెను. తల్లియు నానందోద్రేకమున గంతులిడుచుఁ బొదలవంకకరిగెను. తనబిడ్డను మృత్యుముఖమునుండి విడిపించుకొని పరికిని [illegible] వెడలిపోవక పూర్వము వెనుకకు మరలి యాతని యెడఁ గృతజ్ఞతావీక్షణముల నొక్కసారి ప్రసరింపఁజేసి తనసుకుమారకిశోరంబుతో దానును దుర్గమారణ్యమధ్యంబునఁ బడిపోయెను.

మంచివారి కెవ్వని హృదయంబున కిది సంతోషదాయకంబు గాకుండును? ప్రాణము దైవమిచ్చు వరములలో ధన్యతమమైనది. సకలవరంబుల నగ్రగణ్యమైనది. కేవల జంతుమాత్రమునకయ్యది పోయినఁ బ్రపంచమంతయును పోయినట్టే. అట్టులయ్యును జంతుసంతానంబునకు సర్వసంతోషభాజనంబైన ప్రాణపంచకమును మనుజులు కేవల తృణప్రాయముగఁ జూచుచుందురు. ఇయ్యవి కేవలము నోరుమాలినజంతువులు.

కాఁబోవు కష్టములను గని పెట్టు జ్ఞానము వానికడ లేదు. అందువలన వానికా భయము లేదు. ఏవిధమైనబాధయు లేనంతవఱకును కేవలశారీరక సౌఖ్యమే యయ్యది మహదానందముగఁ బరిగణించుచుండును.

హరిణకిశోరమును విడిచిపుచ్చినది మొదలు మనపథికుని హృదయము మెత్తబడినది. ఆతనిహృదయమున గాఢమగు మనోవికారము లుత్పన్నములైనవి. చంకనున్న సంచిలోఁ బచనమైనయన్నము కొంచెమున్నది. దానితో తనకుద్బాధను బ్రీతిపూర్వకముగఁ జల్లార్చుకొనియెను. ఆప్రదేశము తనకు విజ్ఞానం బుదయించిన స్థానంబగుట నత్యంతముఁ బ్రేమాస్పదమయ్యెను. ఆరాత్రియాఁతఁడచ్చట నుండఁదలఁచెను. పరోపకారసుకృతకార్యంబొకటి యానాఁడచ్చటఁజేయఁగలిగెఁగదాయని యాతఁడు తనమనంబున మఱిమఱిపొంగిపొరలుచుండెను.

ఆరాత్రి స్వర్గతుల్యముగనుండెను. చెట్లసందులనుండి నిర్మలముగ చంద్రకిరణామృతంబు ప్రసరించుచుండెను. లేఁగొమ్మలు సాయంసమయసంజనితవాతపోతంబుల మృదుస్పర్శనంబునఁ జలించుచుండెను. తత్సంచలనంబున నీచల్లనికిరణంబులు,వక్రభావంబునందుచుఁ దమయథామార్గమున కెడమగుచుఁ దద్వాయువంశంబున మినుకుమినుకుమని నటనము సేయుచున్నట్టులుండెను. గహనప్రదేశము దుర్దర్శనము. నీలవర్ణంబున భాసిల్లునభోమండలంబునఁ జంద్రకిరణధాళధళ్యంబు దర్శనీయంబు. తత్సమయంబునఁ బ్రకృతిసర్వథా ప్రస్తిమితంబు, మనుష్యుఁడట్టి శబ్దవిరామసమయంబున దినకృత్యంబుల విసివివేసరి విశ్రాంతిఁ గైకొనును. ఈకడపటికార్యంబునఁ దత్ప్రదేశగాంభీర్యంబునకు మఱింతయతిశయంబుదయమయ్యెను. ఘాతుకమృగములు విచ్చలవిడిగ సంచరించుచున్నవి. తత్పర్యటనసమయంబున నప్పుడప్పుడు సేయుగర్జారవంబు ప్రకృతిజన్యంబై హృదయంగమంబైన స్వరమాధుర్యంబునకొకవిధంబగు శ్రుతి సామ్యంబుగ నొప్పుచుండె.

అంతమనపాంథుఁ డెండిపోయినయాకులఁ గొన్నిటి నేరితెచ్చి, ఆకునలముదట్టముగఁబెఱిగి యావరించియున్న యొకచెట్టుక్రింద పండుకొనుటకుఁ దగినయిరవుకల్పించుకొనియెను. ఆచెట్టుకొమ్మలు భూమికి రెండుగజములయెత్తుగ నుండి దానిక్రిందశయనించువానికి మేలుకట్టువలె మెఱయుచుండెను. సులభసంపాదితంబై గహనప్రదేశసముచితంబైన యాశయనంబున శయనించి యత్యంతపరిశ్రాంతిచే చిరకాంక్షితంబై యున్న నిద్రావధూటిని దృఢాలింగనంబొనరించెను. ఆతనిమనోభావములును బ్రశాంతములు, పగటిపూటజరిగినసంగతులు తలంచిచూచికొనియెను. మరణించినతనగుఱ్ఱమును దలఁచికొనిన మనసునకుగష్టముగానుండెను గాని యతిసంగ్రహంబుగనున్న తనజీవిత

చరిత్రంబునఁ జరిగిన యా చిన్నయుపాఖ్యానము తలంపునఁ బొడమినతోడనే యామనఃఖేద మంతయుఁ బటాపంచలగుచుండెను. దుఃఖాకులాత్మయగు తల్లిలేఁడికిఁ దానుమరల నొసంగిన యాహరిణకిశోరజీవితమును తద్వృత్తాంతమును తడవిచూచుకొనినప్పుడెల్ల నాతనిమనస్సు సంతుష్టిఁ జెందని తరుణము లేదు.

నెమ్మదిగ విశ్రమించి తథావిధంబగు యోచనలచేఁ గొంతవడి వ్యగ్రమనస్సునారాటంబున ముంపుమునత్తగత్క్షణముననే మరలఁ దనమనస్సు నేదియో యొక్కయావేశం బాకరింప నారటంబెందుచుఁ గాలక్షేపము సేయుచుండెను. ఎట్టకేలకుఁ బథపరిశ్రాంతిచే దేహంబును, యోచనభారంబున మనస్సును బడలికఁ జెందుటచే గాఢనిద్రావివశుండయ్యెను. ఆనిద్రయందు గతదివసంబున జరిగిన కార్యంబులన్నియును వచ్చి మనంబున జేరుకొనినట్టులయ్యెను. తత్కార్యముల కనుబంధములుగ నూతనవిషయములు కొన్ని పొడసూపుచుండెను. తన్నూతనవిషయంబులు మున్నతానెన్నడు గన్నదియును విన్నదియును గాకుండెను. విస్పష్టముగ మనమున వింతవింతరంగులతోఁ జిత్రించినట్లుమాత్రముండెను. ఆతనికాస్వప్నమున నొకమహాచార్యుని సందర్శించినట్టులయ్యెను. ఆతనిమేనవస్త్రములు తళతళ మెఱయుచుండెను. అందుండి తేజస్సొకటి ప్రసరించుచుండెను. దానికాంతిచూచునప్పటికిఁ గన్నులు మిఱుమిట్లుగొనియెను. అంత నానిద్రితునితో నామహాచార్యుఁడువచ్చి "నేఁడు దుఃఖభాజనమగు జంతువునకు నీవుచూపినభూతదయ దయామయుండగు దైవమునకుఁ బ్రశంసనీయంబయ్యెను. ఆతండు నోరును వాయియు నులేనిజీవులకును జ్ఞానశక్తిగలప్రాణికోటికినిగూడ నధీశ్వరుండు. నీయౌదార్యంబునకు బహుమానరూపకంబుగ గజనీరాజ్యమును నీకాతం డొసంగుచున్నవాఁడు. అధికారవశంబున నీసద్గుణమడుగంటరాదు. నేఁడు పసరమునెడ నెట్టిభూతదయ చూపితివో మనుజునియెడఁగూడ జన్మమున్నంతవఱకు నట్టిపరోపకారమే చూపుచుండవలయును." అనియుపదేశించెను. ఈమాటలాతనికి వినఁబడియెను. దేవదూతయదృశ్యుఁడయ్యెను. యువపథికుఁడును మేల్కొనియెను.

ఆకాశపథంబునఁ జంద్రుఁడింకను నిర్మలముగ వెలుంగుచున్నవాఁడు. కాని మరలనాతనికిఁ గూర్కు లేదు. ఆతఁడుకాంచినది స్వప్నమేగాని మెలకువఁగనిన యనంతరముగూడ నాతనిమనోనయనంబున కయ్యది యెట్టయెదుటదృశ్యమగుచున్నట్టులే యుండెను. నిద్రయెంతగావచ్చి మీఁదబడుచున్నను, ఈపూర్వస్మృతిదానిని రాకుండఁ బోఁద్రోలుచుండెను. ఆతఁడు శయనమునుండి లేచెను. చెట్లమాటున నస్వచ్ఛ

ముగ వెలుంగుచున్న వేగుచుక్కను గాంచెను. అధిక తేజోమయంబైన యరుణ తేజస్సునకు దారియిచ్చుటకో యన నావేగుచుక్క క్రమముగ నాదారినుండి తప్పించుకొని పోయెను.

దూరపుకొండలలోఁ చంద్రుఁడు క్రమక్రమముగ నస్తంగతుండయ్యెను. మంచు దట్టముగఁ గురియుచున్నది. సన్నని వెండిరేకువంటి మంచుతెరయొకటి దృశ్యపదార్థములనెల్ల నావరించి యాపదార్థములకెల్ల భసితవర్ణము వేయుచుండెను. సితాసిత వర్ణంబున నొప్పు నుషస్తేజస్సు బయలంతయుఁ గ్రమ్మెను. కాని తుషారసంఛాదితంబగు లేఁగిరణములు కొండలోయలనెల్లఁ బూర్ణముగ వెల్లివిరియు పర్యంత మరుణకిరణంబులు మానవపథికునకు లోచనగోచరంబుగాకుండెను. సన్ననిమంచుతెర దళసరియయ్యెను. చెట్లయాకులనుండి మంచుబిందువులు జోటజోటరాలి పడుచుండెను. దట్టముగ మొక్క మోటిక లేని ప్రదేశములెల్ల వాతావరణమునుండి పడిన నీటిబిందువులచేఁ జెమ్మగిల్లి తత్ప్రదేశంబు వివిధవర్ణసమాకీర్ణంబై యలరుచుండెను. పచ్చికపోచలెల్ల జలబిందుభారంబున తలలు వంచి వియత్పథపాతంబగు పరిశుద్ధవాఃకణంబులయాచితలభ్యంబులగుట గర్వించెనో యనఁగ సుకుమారంబులగు తమకంఠంబులఁ గుంచించెను.

సర్వపదార్థములును నేతన్మాలమున సంఛన్నంబులై యుండెను. ప్రభాతవాతంబువచ్చి తదాచ్ఛాదన మెల్ల వెలువరించెను. అంతఁ బ్రతిపదార్థమును దన ప్రకృతిసిద్ధమగు వర్ణమును దాల్చెను. ఛాయాతేజస్సులు రెండును సమ్మేళనమయ్యెను.

యాత్రికుఁడును దానుపండుకొనిన యాకులనెల్ల పోగుచేసి మంటవేసి చంక సంచిలోనున్న కొబ్బరిహుక్కను దీసి చిలుములో వేసి పీల్పఁజొచ్చెను. పిమ్మటఁ జల్దియన్నము కొంచెముండగాఁ గొంతయాఁకలిఁ జల్లార్చికొనియెను. రాత్రి యరఁటియాకొకటి దొన్నెగాఁ గట్టి యుంపనందు మంచునీరు కొంతచేరెను. ఆనీటితో దప్పిఁ దీర్చికొనియెను.

అతఁడు తిండి కడుపునిండఁ దినకపోయినను నయ్యదినిర్మలహృదయంబుతో నారగించుటచే సంతుష్టిగనుండెను. సంచి మరలఁగట్టి భుజమునఁ దగిలించుకొని మరలఁ బ్రయాణోన్ముఖుండయ్యెను. కానియాతూరి తొలుదొల్త పుణ్యనగరంబు వంక తిరిగి యతి భక్తితో భగవంతుని ధ్యానించి తన యాత్రాసమయంబుల తన్నుగాచి కాపాడుమని మ్రొక్కులిడియెను.

ఆతఁడిప్పుడు నడయాడుచున్న మార్గము మున్నెన్నఁడు నాతఁడు తిరిగిచూచి నదికాదు. ఒంటరిగఁ బోవుచున్నవాఁడు. దారిక్రొత్తదారి. నిద్రలో నాతఁడుగాంచిన స్వప్నసందర్శనంబు మాటిమాటికిని నెదుటవచ్చి సాక్షాత్కరించినట్టులగుచుండెను. దానిఁబట్టి, అయ్యది, భగవంతుండు తనయెడఁ బ్రసన్నుండై యవ్యాజకరుణం గటాక్షించిన వరంబగునోయని మనంబున యోచింపఁ దొడంగెను. ఈతని కూడును బేరును లేదు. ఇల్లును వాకిలియు లేదు. అట్టివాఁడు ప్రబలంబగు రాజ్యంబున కొక్కస్థాని కధీశ్వరుం డగుట యను మాట తలంచికొనిన నయ్యది స్వప్నసాక్షాత్కారంబె కావలయుం గాని యథార్థంబు కావుట యసాధ్యంబని కనుపట్టెను.

స్తిమితముగ యోచించుకొనియెను. రాత్రి యొదవినస్వప్నము నిద్రాసమయమునఁ గలిగిన యోచనాజాలంబునందలి చైతన్యవిశేషమే గాని మఱియొండేదియును గాదని నిశ్చయించుకొనియెను.

ఆతనిమనస్సునగాఢముగా నాటికొనిన యప్పటిసంగతులు కొన్నికొన్ని చిత్రించినట్లు నిలిచిపోయెను. అచ్చునఁబొడిచినట్లు మనస్సునఁ బ్రతిఫలించిన యాతలంపుల వలన గుప్తంబులైయున్న యాంతరంగిక భావంబులన్నియును బయలువడియెను. అందువలనఁ దత్స్వప్నసందర్శనంబు దృష్టఫలంబు కావచ్చుననుతలంపు లుత్పన్నంబులగుచుండెను. దైవసత్తంపైనబహుమానంబు హేతుబద్ధంబుఁగావించి చూచినను, జరుగఁదలంచినకార్యమునందలి సందర్భాసందర్భములవిచారించినను, నట్టితలంపుమనంబునఁ జొరనిచ్చుట యసంభవంబుగను కేవలమసంగతముగను, వెఱ్ఱిభ్రాంతిగను గన్పట్టుచుండెను. కానిరాత్రియొక్కమారు స్వప్నమునఁ బూర్వోదాహృతంబగు దైవవాక్యమొకటి వినంబడెఁగి. అయ్యది మాత్రమాతఁడు మనంబునుండి త్రోసివేయలేకుండెను.

---

## ద్వితీయ ప్రకరణము.

పాంథుఁడుదుర్గమారణ్యములంబడి గమనించుచుండెను. త్రోవమిక్కిలిఁ గష్టముగ నున్నది. ఆతనియోరిమియును దదనుగుణ్యమైయొప్పినది. రాత్రివిశ్రమించిన ప్రదేశమునుదాటి విశేషము దూరమింకనుజనలేదు. అచ్చటియరణ్యము తెరపిగా నున్నది. చెట్టునుజేమయును నేవియులేవు. అన్నియును భేధింపఁబడినవి. మనపాంథునికన్నులకచ్చట ముందు నున్న నెగడియొకటి కన్పట్టెను. దానిచుట్టునుజేరి చలిగాచుకొనుచునెనమండ్రు మనుష్యులున్నవారు. అందుఁగొందఱు పొగద్రాగుచుండిరి. కొందఱుకోలఁదికోలఁదిగ మిగిలియున్నచల్దియన్నము మెక్కుచుండిరి. వారుశత్రులైనను మిత్రులైనను తప్పించుకొన్నందువలనఁ బ్రయోజనములేదు. అవకాశమునులేదు. వారిమనోగతభావమేమియో తెలియదు. ఏమైననుగానిమ్మని తెగించి వారిసమీపమునకరిగెను. దగ్గఱియూరికిదారిచెప్పుఁడనియడిగి వారినిబలుకరించెను. అందొకఁడు లేచి పాంథునిజేరవచ్చి మనోగతభావంబు వెలార్చునగవుతో

"మీపైనము నింతటితో నేలకట్టిపెట్టరాదు?" అనియడిగెను.

"అట్లుచేయవలనుపడదు. మీరుత్రోవఁజూపినఁజూపుఁడు. లేకున్నలేదు. నాకు మాటలతోడ జాగుచేయుటకవకాశములేదు." అనిపాంథుడు ప్రతివచనంబిచ్చెను.

"మంచిది. ఈమార్గమునఁ బోవుబాటసారులందరును సురక్షితముగఁ బోవుటకై కొంతకర్చుపెట్టుట యాచారమైయున్నది."

"నాకుమార్గముచూపువారితోఁ బ్రసక్తియేమియునులేదు. అట్టికప్పమేమియును నేను జెల్లించువాఁడనుగాను."

"ఇటువినుము. మేమిప్పుడెనమండ్రమున్నారము. నీవొక్కఁడవు. మాతోడి పోరునకోపఁగలవా? బాగుగయోచించి గొంతుకగొంచెము సంబాళించుము. సమయమువచ్చినప్పుడెల్ల మాతెలివితేటలుపయోగించి ధనముసంపాదించు చుందుము. అట్టి యవకాశము చిక్కకున్నపుడు దొరకినదానితోడనే జీవించుచుందుము. నీచంక నేదియో మూటయున్నది. అందుసొమ్మున్నదా? దానినిప్పుడు మాకుదరిసించిమఱీ పోవలయు. మేమడిగినమాట కడ్డుచెప్పరాదు. జరిగితీరవలయును."

"అట్లయిన మీరందఱు దోపిడికాండ్రా?"

"అవును. అయిననేమి?"

"అట్లయిన నీవు వెనుక నేమగురుకాదు నూఱుమందియున్నను నేనులోఁబడియుండరాదు,"

అనునప్పటికి దోపిడికానికి నవ్వు వచ్చెను. తనసంగడికాండ్ర వంకఁ దిరిగి “ఈయన దవుషశుద్ధమైనఁగాని దారికివచ్చునట్లు లేదు. మనముచెప్పినమాట యేదియును నీతఁడు చెవినిబెట్టుకున్నాఁడు. మనకు రావలసినది మనము లాగుకొనవలసినచోఁ బ్రహారణములుతప్ప మిగిలిన వేవియును పనిచేయునట్లు లేవు. ఈయనమాటలబింకము చాల హెచ్చుగనున్నది.” అనిచెప్పుచుఁ, బాంధునివంకఁ దిరిగి “రా! రమ్ము. నీచంకను వికారముగ నదేదియో వ్రేలాడుచున్నది! దానినచ్చట దింపివేయుము. ఆమూటబరువునఁ గ్రుంగియున్నవాఁడవు. మూటబరువువలన నీయధార్థప్రమాణము బయలువడఁగలదు. నీచాకచక్యమేదియో చూపింతుగాని రమ్ము.” అనియెను.

పాంథుఁడు, ప్రాణముగ్రుక్కఁడు. దానివన్నప్పుడు నాసించినఁ బ్రయోజనము లేదు! దైవమువచ్చి చెప్పినను ప్రాణముపోయినఁగాని యీమూటయును ముల్లెయును మీకొసంగువాఁడను గాను. ప్రపంచమునఁ గష్టములుతెక్కుమటి యెవ్వియును గనఁబడనప్పుడును, ముందెటుచూచిన నేమియును మార్గముదోఁచనప్పుడును మనుజునకుఁ జావొకలెక్కలోనిదిగా నుండదు. మీరుదోపిడికాండ్రె కావుదురు. అయినను భద్రముగ మెలంగుఁడు. మీయందు దయాదాక్షిణ్యములుండవు కాని నేను నాప్రాణములకు తెగించియున్నవాఁడను.”

అనిచెప్పుచు నొకచెట్టునొద్దకుఁ బోయెను. కత్తిదూసి పృష్ఠభాగంబు చెట్టునకుఁ జేర్చి నిలువఁబడియెను. “చండుఁ, సంసిద్ధుఁడనై యున్నవాఁడ” నని కాలుద్రవ్వెను. ఎదిరిబలాబలంబు తెలియంగక తమ్మెదిరింప జూచు పాంథునిమనోనిశ్చితంబునకు విస్మర పడుచు వారందఱునొక్కుమ్మడి నూరకొనిరి. కాని యందొక్కఁడులేచి యీమహాధీరునకుఁ దనశక్తిసామర్థ్యంబు తెలియంగఁజేసినఁగాని కార్యములేదను నుద్దేశముతో బాణమొకటి గుఱిచేసి ఖడ్గము చేనలరుచున్న మనపాంథునిహస్తమును అతనివెనుకనున్న చెట్టునకంటవేసెను. పాంథుఁడాబాణమును దృణప్రాయముగఁ దీసి యావలఁ బాఱవైచి ఖడ్గప్రహారణంబులకుఁ జేయెత్తెనుగాని యయ్యది క్షీణబలమైనదై చేయవలసినపని చేయలేకుండఁబోయెను. అంతనాతనిస్పర్థి క్షణికములో నాతనినోడించి చేతనున్న కత్తియుఁ గటారియును లాగికొనెను. ఆతనిమూటయు ముల్లెయు విప్పిచూచునప్పటికి వారికిఁగలిగిన యాశాభంగమింతింతనరాదు. దానినివిప్పిచూచుటతోడనే యందలి వస్తుసముదాయము నెత్తి తలారయొకతెన్నునఁ బాఱవైచి “యింతటియమూల్యమైనయాస్తికా యంతగా ప్రాణములకు తెగించితివని వానిని వెక్కిరింపసాగిరి.

మున్నుముచ్చటించుచున్న బందకాఁడె మరల ముందునకువచ్చి “ఈతనియొద్ద సొమ్ము సంబంధమేమియును లేదు. ఆఁకలిపుష్టిమాత్రముగట్టిగనున్నది. ఇట్టిదృఢకా

యుని మనము విక్రయించితిమేని మంచిధనమిచ్చి వీనిని బానిసనుగాఁ గొనిపోవుదురు. వేరొకఁడు దొరకువఱకు నీతఁడు మనతోడనే యుండును. ఈభుజవ్రణంబు నకుఁ దగినవిలువవచ్చునెడల వీనిసంబంధము వదల్చుకొందము. అప్పుడీతఁడీమూట చంకను దగిలించుకొని పోవుటకుమారుగ నెత్తినిబెట్టికొని మఱిపోవును. ఈపాటి యిటునమ్ము. నీదండచేతినిరక్తము స్రవించుచున్నది. దీనినిమాన్పుకొనుము. అంత వఱకు స్థిమితముగనుండుము. ముందుమార్గమునకు నీకుమార్గమప్పుడు కనబడునులే॥ అని చెప్పెను

మనపాంథుని చేతులురెండును దలనున్నపాగఁదీసి కలియగట్టిరి. దోపిడికాం డ్రిద్దఱు, ఇటొకఁడును, అటొకఁడును వెంటరానీతఁడుబలిమిని వారిననుగమించు చుండెను. మరలవారు దట్టమైనయడవిలోఁ బ్రవేశించిరి. అచ్చటికనతిదూరముననే గుడిసెలుకొన్నియున్నవి. ఈయడవిలో గుడిసెలేమూలనున్నవియు నెవ్వరికిని గనిపెట్ట శక్యము గాదు. ఆగుడిసెలడవిలో బయలుదేరిన మొక్కలయును మోటికయును బెట్టి కట్టినవి. ముందుభాగమునఁ గొంత తెరపిచేసికొనిరి. విధినిషేధశూన్యులగువారు పొగఁ ద్రాగుటయు నచ్చటనే. వంటలక్కడనే. ఆలోచనాసభలచ్చట. ఒక్కొక్కగుడిసెకొక్కొ క్కకుటుంబమున్నది. అందఱకును పెండ్లిండ్లైనవి.

పాంథునకుఁ బ్రత్యేకవసతిలేదు. దోపిడిగాండ్రు రెండుగంటల కాలము పనిచేసి యొకగుడిసెను గట్టియిచ్చిరి. దానికివారుచేసినదెల్ల నడుగునడుగుదూరముగ వెదురుగడ్డలుమాత్రము పది, యడవిలోఁగొట్టి తెచ్చిపాతిరి. ఈగుడిసె దట్టముగఁ బెరిగిన చెట్లక్రింద వేసినారు. ఆచెట్లయాకులెదీనికికప్పు. నిలువునవేసిన వెదుళ్లకు అడ్డముగాపేడు జవ్వలు తెచ్చియల్లిరి. మధ్యనున్న సందులకు ఆసులనుదడిక్రిందఁగట్టిరి. లోపలను న్నయాకుల అలమును నేరి పాఱవేసిరి. ఇల్లుతయారైనది.

రెండుదినములు జరిగినవి. మనపాంథునిస్థితిగతులకుఁ గొంచెముమార్పు కలుగన లసివచ్చెను. గాయముమానుచున్నది గాని చేయి నిక్కివాకుండఁ బోయెను. పట్టిబంధించిన దినమున నాతనిచేతులెట్లున్నవో నేఁటికిని నట్లే యున్నవి. ఆకట్లింకనువిప్పలేదు. మూడవ దినమున వారియిండ్లకు ముందుభాగమునున్న ముంగిటికతనినిగానఁ దోడ్కొనివచ్చిరి.

ఆదొంగలకెల్ల నాయకుఁడగు నాతఁడు పాంథునిబిలిచి "నీజీవనప్రవృత్తి నింతటి తో మార్చుకొనవలయును. మేముదొంగలము. మావృత్తిధర్మమునకు నాత్మబుద్ధియు స్థైర్యస్థైర్యములు కావలయును. నీతల్లినిన్ను ధైర్యశాలిగాఁ గన్నది. మేమెట్లుమెలం గుచున్నవారమో నీవుచూచుచున్నావు కదా! తినుబండారములు లేనప్పుడు మాకు కొనవలయుననే నియమము లేదు. మార్గముసరిగనున్నది కాదను బాధయు లేదు."

పాంథుఁడు. "అయ్యా! నేను దొంగతనము చేయుటకుఁ దగినవాఁడను గాను. నా యంతరాత్మ యంతవఱకు మొద్దుబారినది కాదు. నన్ను మీరు నమ్మవలదు. మీరు బయలుపడి పోవుదురు."

"అయిననుసరే. తెగించెదము. శూరుఁడు తన శౌర్యధర్మము నవిడనాఁడ నేరఁడు. ద్రోహచింతలును, ఏతన్మార్గగమనములును పిఱికిపందలవి. నిన్ను మేము నమ్మియే చరింతుము."

"ఇప్పుడు మీరునట్టి తెలివిమాలిన వ్యవహారము చేయుచున్నారు. శూరులెప్పుడును యోగ్యజీవనము చేయవలయును. యోగ్యజీవనముకు దిగినచో దొంగతనములు బయలుపడకమానవు. దొంగలు సంఘమునకు వేఱుపురుగులు. అట్టివారిని బట్టియీకుండుట యోగ్యులగువారికి ద్రోహము."

"నీవు పిఱికివాఁడవే యనుకొంటిమి గాని యోగ్యుఁడవని మాతలంపు కాదు. ఒక్కొక్కప్పుడు నీవిందునను అందుననుగూడఁ దెలివిమాలిన వాఁడవని యనుకొనుచున్నాము. గుఱ్ఱమును మాలీస్తుచేయుటకును, బానిసచాకిరీచేయుటకును సరికినట్టువు. ఏమైనను గానిమ్ము. ఇంకముందు శీఘ్రముగ వృత్తిధర్మ మవలంబింపుము."

పాంథుఁడు అంటఁగట్టియున్న రెండు చేతులు పైకెత్తి చూపుచు "ఈబంధమే మీకు శరణ్యము. ఆపదవాటిల్లు తరుణములు దాటిపోవునెడల భీరులంతటి మహావీరులు మఱియొకరుండరు. గాయముదగిలి యంగవైకల్యము బొందిన మనుజుని బట్టి యధిక్షేపించుట శూరునకు లక్షణము కాఁబోలు." అనియెను.

ఈవిన్నపము మనబడాచోరున కొక్కింత గర్వభంగముఁ గావించినది. కాని యయ్యది యాతనికి మునుపటికంటె నెక్కుడయుత్సాహమును గలిగించెను.

"మీరు చెప్పినది బాగుగనే యున్నది. మా యయోగ్యతయనునట్టి యభిప్రాయమున్నదో శౌర్యమున్నట్టి యభిప్రాయమే. ఈ రెంటితోడనుగూడ మాకిప్పుడు ప్రసక్తిలేదు. నీవిప్పుడు మాతోడఁ జేరి పనిచేయుటకు కలిసిరాకున్నవాఁడవు. నీకు ఇల్లును వాకిలియునునిచ్చి తిండిపెట్టి పోషించుచున్నాము. దీనికి మాకియ్యవలసినదేమియో యిచ్చివేయవలయును. నీయొద్ద సొమ్మియును గనిపించుటలేదు. నిన్నే యిప్పుడు విక్రయించి నిన్నుఁగూర్చిపడిన పాటునకును నష్టమునకును దగిన ద్రవ్యము తెచ్చికొందుము."

అని చెప్పి యాతఁడు మనపాంథుని వెంటఁగొని దగ్గరి యూరునకుఁ బోయెను. ఆయూరును నాయకవికిఁ జేరువగనే యున్నది. అక్కడనైన మంచియిల్లొకటియును లేదు. అన్నియును నసహ్యాకరములగు గుడిసెలే. అందున్నవారందఱును హీనజాతి

కారు. వీరచ్చటకుఁ జేరిన కొంతసేపటికి వర్తకుఁ డొకఁడు వచ్చినాఁడు. అతఁడీవాంగకుఁ దగినసొమ్మిచ్చి మనపాంథుని బానిసక్రిందఁ గొనిపోయెను. పాంథుఁడు బానిసయైనాఁడు. ఇప్పుడీతని జీవనము వంటి జీవనము నపేక్షించువారెవ్వరైన నుందురా? స్వప్నఫలమిదియే కాదేమి? కానియిదియును నాతనిమనసునకొక విధమైనసంతుష్టియే సమకూర్చెను. స్వప్నములు నిద్రాసమయమున బుద్ధికిఁ గలిగినవింత వికాసములవలన జనించుచున్నవి కావని యాతనికి గట్టినమ్మకమున్నదందురా? అదియే యథార్థమగునెడల నిట్టితలంపులు మనంబున నొక్కక్షణికమైనఁ జొరనిచ్చుట యెట్టిపిచ్చితనమో యయ్యది దీనివలననే తేలిపోవుచుండెను.

నిస్పృహఁ జెందుటవలన ఫలములేదు. విధికృతంబనుభవింప నిశ్చయించుకొనియెను. దైవమే శరణ్యముగా నెన్నికొనియెను. తనయంతరాత్మను వక్రగతిని పోనీయకుండ ముక్కుసూటిగఁ బనిచేయ నెంచినవాఁడు. ఇట్లు కృతనిశ్చయుఁడయ్యెను వర్తకుని కొలువున ప్రవేశించెను. వర్తకుఁడు ముందుగ నీతని గాయముమాటచూచికొనియెను, దానిని జాగరూకతతో బాగుచేసి కట్టుకట్టించెను. అతని ఛాతీయును తక్కిన యితరావయవములును పట్టిచూచి యతని యవయవపటిష్ఠత యెంతవఱకుండెనో నిశ్చయించుకొనియెను. వర్తకుని మొగము కొంచెము ముడుతలు బడియుండెను. ముఖవర్చస్సు చామనచాయ. ఎఱుపునలుపు గాకుండ మధ్యస్థముగ నుండెను. అతని ముఖమున పైత్యసంబంధములగు నరము లన్నియును ప్రబలియున్నట్లు కనుపట్టుచుండెను. గడ్డమాతనిదియంతయొత్తుగలేదు. బల్లపఱుపులేక మొనతేలియున్న తన్ముఖభాగమున రోమములక్కడక్కడఁ బెఱిగియుండి వ్రేలుచున్నవి. అతని కేవలము బానిసవర్తకుఁడని చెప్పకొనుటకు వీలులేదు. వృద్ధాప్యముచేత వరుసైయున్నవాఁడు. అతనియొద్ద దేహపటుత్వమున వన్నెగన్న పరిచారకులు చాలమందియున్నవారు. తమయజమానుని దేహమునందు లోటుగనున్న రక్తమాంసములు వీరియందు పూర్ణమై యుండెను.

అతఁడింతకు మున్ను జీవయాత్రయెట్లు గడుపుచుండెనో యడిగి తెలిసికొనియెను. అతఁడు మున్నవలంబించిన వృత్తిధర్మములంబట్టి యాతఁడు దేహదార్ఢ్యమునకు సుప్రసిద్ధుఁడై యెట్టికష్టములనైన నోర్చు ప్రబలకాయుండై యుండునని నిశ్చయించుకొనియెను. చేరమువలన మంచిలాభము వచ్చునని పరిగణించెను. గుప్తహస్తుఁడగు నావేపారీ యాతని జాగరూకతతోఁ జూచుచుండుమని పరిచారకుల కుత్తరు విచ్చెను. ఆవర్తకుఁడా యూరివాఁడు కాఁడు. అతఁడచ్చట నొకదినముండి యచ్చటనుండి కోరావాడు దారిని బట్టిపోయెను. ఎంతయో కష్టపడి యాయూరు చేరిరి. వర్తకుఁడీబానిసను తనయింటియొద్దనే పెట్టుకొనియెను. తిండిసదుపాయముఁ జక్కఁగఁ జరిపెను. ఆదరణ

యును లోటు లేకుండఁ జేసెను. దీనికంతకును గారణము, అమ్మఁజూపినపుడు ఎక్కువ బేరములు రావలయుననియే. తనయొద్దనున్న గబలసిన బానిసయొకఁడున్న వాఁడనియు చాటింపుచేయించెను. ఈవింతయేమో చూతమని కొనఁదలఁచిన బేరగాండ్రు చాల మందివచ్చి చూచి పోవుచుండిరి. కొందఱడిగినంత డబ్బియ్యలేక మానిరి. కొందఱంతవి లువచేయఁడనివదలిరి. అందువల్ల నీతఁడమ్ముడుకాలేదు!

వర్తకుని కాత్రము హెచ్చెను. లాభము లేదు. ప్రతిదినమును, గర్చు తప్పుటలేదు అందువల్ల నమ్ముదర తగ్గించుట మేలని యెంచి యట్లు చేసెను. ఎక్కువబేరమునకని యూసించి యుండి అట్టె నిలిపియుంచినచో దండుగ యెక్కువగఁ గాన్పించెను. వీఁడు శీఘ్రముగ వదలిపోయెడి సూత్రము కనిపించకుండెను. ఒక్కయుపాయము తోఁచెను. ఇట్టి స్వాతంత్ర్యరాహిత్య మెవ్వరికి నుండ రాదనియును, బంధమోక్షణంబునకై తన బానిసయాతఁడే యాత్రపడుచుండు ననియు, తగినంతధన మిచ్చిన నిన్ను ముక్తుం జేసెద ననినచో నాతఁడే డబ్బిచ్చి విముక్తుం డగుననియుఁ దలంచెను. ఈతలంపు మన స్సున మారునప్పటి కత్యంతానందుం డయ్యెను. ఇది యెవ్వరికి నిదివఱకుఁ బుట్టినతలంపు కాదు. క్రొత్తది. బానిసవాని గొనువానికన్న బంధమోక్షణంబు సంపాదించుకొను నాతం డెక్కువమూల్య మియ్యవలయు నని వాదింప మొదలుపెట్టెను. మనుష్యుని కొనువానికన్న స్వాతంత్ర్యము కొనువాని కెక్కువలాభము కలుగు నని కారణము చెప్పెను. ఈ నెపముచే ముందటిదానికన్న నెక్కువ మూల్యము చెప్ప నిశ్చయించుకొని తనవిక్రయపదార్థంబు నొద్దకుఁ జనియెను. ఆతనిని బిలిచి,

"నీకు స్వేచ్ఛగా నుండవలె ననుకుతూహలము లేదా?" యని యడిగెను.

"ఆఁకలిచే మలమలమాడుచున్నవానియొద్దకు వచ్చి అన్నము కావలయునా యని యడిగినట్లు లున్నది."

"అట్లయిన దానికి తగినమూల్య మిచ్చెదవా?"

"ఏరూపమున?"

"ద్రవ్యరూపకముగనే. ఇంకెట్లు?"

"అదిమాత్రము నావల్ల కాదు. దైవమనుగ్రహించిన వానిములలో ధన్యతమమైనది నేను ధనమిచ్చికొనుట నాయభిలాష కాదు. నీగొంతుక కోయుటకు నాకెంత స్వాతంత్ర్య మున్నదో నాస్వేచ్ఛ తీసివేయుటకు నీకంతస్వాతంత్ర్యమున్నది. దుర్మార్గులను దోపిడీకాండ్రను ధనమిచ్చి ప్రోత్సాహము చేయు నీవంటివానికంత మున్నెరించుటధర్మము."

ఈమాటలు వినఁబడునప్పటికి ముసలివాని మొగమున కత్తివ్రేటునకునైన నెత్తురుచుక్క లేకుండఁ బోయెను. నోట మాట రాదయ్యెను. తేలుకుట్టినవాఁడు బాధపడునట్లు ఆగ్రహోదగ్రుఁడగు బానిసవానిని జూచిన మొదలు, గడగడ వడంక సాగెను. అంతటినుండి వర్తకుఁడు తనబానిసను మునుపటికంటె హెచ్చుగా బాధింపఁ దొడంగెను. వాని మెడకు గండకత్తెర తగిలించి నిరంతరమును జేయరాని చాకిరీయెల్లఁ జేయించి తాను దినదినమును వెచ్చించు ద్రవ్యమును మళ్ళించుకొనుచుండెను. అట్టి సమయమున, ఖొరాసానురాష్ట్రమున కధినాథుఁడగు అలప్తజీనను నాతఁడు ఈబానిసవానిసమాచారము విని యాతనిఁ జూడనభిలషించి వచ్చెను. అతనిని సందర్శించెను. ఆరాష్ట్రాధినాథుఁడు శీఘ్రమే యావర్తకునకు వలయుధన మిచ్చి మనపాంథుని బానిసనుగా గొనియెను. బానిసవర్తకున కీభేరమువలనఁ గలిగిన యానంద మింతంతనికాదు.

## తృతీయప్రకరణము.

బేరము పూర్తియైపోయినది. బానిసవానిని రాష్ట్రాధినాథునిమందిరమునకుఁ గొనిపోయిరి. అతనికి గృహకృత్యకార్యములఁ బరిచర్య లభించెను. కాని అలప్తజీను అతనిని చూచి యతం డాదాసీపనులకన్న నెక్కువకార్యములకు దగినవాఁడని యెంచి తనయంగరక్షకునిగా నియమించెను. ఈమార్పువలన మనపాంథుఁడు తన యజమానుని యనుగ్రహమునకును, ఆదరణమునకును బాత్రుఁడయ్యెను. ప్రశంసనీయం బగునీయభిప్రాయము క్రమాభివృద్ధిఁ జెందెను. పిమ్మట రాష్ట్రమునఁ బేరుగన్న పెద్ద యుద్యోగమొకటి యీతని కీయఁబడెను. ఉదారలక్షణసంపన్నుం డగునాబానిసవాని సుగుణసంపత్తి కనిపెట్టి అలప్తజీన్ ఆతని పుట్టుపూర్వోత్తరములఁ జెప్పుమని యడిగెను. ఆబానిసవాఁడును,

“నాచరిత్ర సంక్షేపమైనది. నేను బంధగ్రస్తుండ నైయుండినను మానహీనం బు లగుకార్యంబు లెవ్వియుఁ జేసి యెఱుంగను. నేను పుట్టిననాఁటనుండియును బానిసను గాను. పేదవాఁడనుమాత్ర మగుదును. పారసీకరాజులలోఁ గడపటివాఁడగు “యజ్ దిజరుద్” అనునాతనివంశమున జన్మించినవాఁడను. అతఁడు “ఓధమనుకాలిపు” రాజ్యమున మూర్వ్పపట్టణసమీపమున జలయంత్రముకడ శత్రువుచే వధింపఁబడియెను. అది మీరందఱెఱింగినదియె. ఆతనికుటుంబము తురుష్కస్థానమున నిలిచిపోయెను. అందువలన నాదేశజనులతో వారికి సంబంధబాంధవ్యములు కలిగెను. అతనివంశీయులే తురుష్కులు. నేను నొకతురుష్కుఁడను,”

"నేను జన్మ మెత్తినది మొదలు దారిద్ర్యమే యనుభవించితిని. చిన్నతనమునుండియును నన్ను బాధించిన లేమియే సర్వనియంత నాకు ప్రసాదించిన శక్తి నెల్ల నుపయోగించి పనిచేయఁ బురికొల్పినది. చిన్ననాఁటనుండియును నాకు ఆటలనిన మిక్కిలి యభిలాష. అందుఁ బేరుప్రఖ్యాతియును గొలఁదికాలముననే లభించెను. దృఢకాయమును ధైర్యస్థైర్యములును నాకు పుట్టుకతోడనే లభించినవి. అందువలన భాగ్యవశత సంచరింపవలయునని బయలువెడలితిని. మాతండ్రి చదువుకొనినవాఁడు. చాల వృత్తాంతము లెఱింగినవాఁడు. దరిద్రదావానలంబున గ్రాగ్గుచుండియును నాకాతఁడు సద్గుణసంపత్తిం గూర్చి విద్య గఱపకుండ వదలినవాఁడు కాఁడు. జ్ఞానబీజములు సద్గుణగౌరవములు నామనంబున నాతఁడు నాఁటిపోయెను. ఇప్పుడు రాజులయాస్థానముల నలంకరించువారలలోఁ జాలమందికంటె నెక్కువవిద్యావంతుఁడ ననియే చెప్పికొనఁగలను. నాచిన్నతనమునుండియునుగూడ నాజన్మ మీఁదారిద్ర్యకారణ్యమునఁ బర్యటనము సేయుటకుమాత్రమే నిర్ణీతమైనది కాదనియును నిరుపేదయయ్యును నీతుఱుష్కుఁడు పేరును బ్రతిష్ఠయును లేకుండపోవువాఁడు కాఁడనియు నొక్కయుద్దేశము మనస్సునఁ బెట్టికొని యుంటిని. ఈయుద్దేశ మింతవఱకుఁ బనికిమాలిన దనియే తోఁచెను గాని యయ్యది మనస్సున గట్టిగ నాటుకొనియుండుటచే నాపందొమ్మిదవయేఁట జన్మస్థానమును విడిచి గజనీరాజ్యసైన్యములఁ జేరవలయుం నని బయలుదేరితిని. దారిలో దొంగలకుఁ జిక్కితిని. తత్కారణంబున బానిసనుగా నమ్ముఁడుపోయితిని. కాని యదృష్టవశంబున నాబేహారి మిక్కిలి దయాళుండయ్యెను."

అలప్తజీన్ తనయాశ్రితునిచరిత్రవిని సంతుష్టుండయ్యెను. అవకాశము చిక్కినప్పుడెల్లఁ దనరాజ్యమున గలపెద్దపెద్దయుద్యోగముల కెల్ల నాతనినియమించుచువచ్చెను. ఆతఁడును దానికిఁ దగినట్లు సంచరించి ప్రభునను గ్రహమునకుఁ బాత్రుఁడయ్యెను. ఎట్టకేల కాతని కీప్రభునిమన్ననవలన "అమీర్ ఖాన్ ఉమ్రావు" అను బిరుదు చేకూఱెను. దానికి సామంతనాయకుఁ డనియర్థము. ఇప్పటి కాతఁడు ఖొరాసాను రాష్ట్రమున నగ్రగణ్యుండయ్యెను. పిమ్మట నలప్తజీనుసైన్యములకెల్లనధినాధుండయ్యెను. సైన్యములన్నియు నాతనియాధిపత్యమునఁ జక్కనిశిక్షల నంది తగినకట్టుబాటులలోనికి వచ్చెను. ఆసైన్యములతో నాతఁడు విజయయాత్రలకు బయలుదేరెను. సైన్యము లన్నియు నాతఁడు చెప్పినంత. అలప్తజీన్ శత్రువులందఱును దత్సేనానిబుద్ధికౌశల్యంబునకు వెఱగందుచు నైదుపదినేసి యాతనికివశంవదులైరి. దేశమంతటను, నెమ్మది నెలకొనియెను. క్రమక్రమముగ దేశమునఁ బాడియును బంటయును వృద్ధినై సమృద్ధం బయ్యెను. అతి శీఘ్రకాలములో నాతఁ డత్యున్నతపదవి నందెను. ఆతా

రణమున నరణ్యమునం దాతనికి వచ్చినకల పదింబదిగ స్మరణకు వచ్చుచుండెను. క్రమముగ నయ్యది తననియతఫలంబు నొసంగునట్లుగఁ గాన్పించెను. పాపము! తండ్రిమాత్రము పుత్రునియున్నతిఁ జూచుటకు బ్రదుకఁడయ్యెను; కాని తల్లిమాత్రమింకను జీవించియున్నది. ఆమె నాతఁడు ఖొరాసానునకుఁ దీసికొనిపోయెను. ప్రజలందఱు దనకొమరునికన్న సద్గుణములను సద్వృత్తికలవారును, మఱియొక్కరు లేరని చెప్పుకొనుచుండఁ గని విని యానందించుచుండెను.

ఎంతకొలఁదికాలములో నెంతయద్భుత మగుమార్పుఁ జూడనయ్యెను? అదృష్టమెంతటికైనం జాలును. మున్నెందఱెంటకో మ్రొక్కులిడునాతం డిప్పుడు మ్రొక్కులందుకొనుచున్నవాఁడు. అంతటికన్న తేజస్సంపన్నుఁడును మహాత్ముఁడును దేశమున లేఁడనిపించుకొనుచుండెను. ఖొరాసానురాష్ట్రాధిపతికి, యీతఁడనినఁ బరమనయ. ప్రభుని యాలోచనాసభల నడపువాఁ డితఁడు. సైన్యముల కధీశ్వరుం డితండు. మంత్రిపుంగవుల కందఱకును ముందుమార్గము చూపువాఁ డితఁడు. తఱచు రాష్ట్రాధీశ్వరునితోడ సంచారము. అతనియుపదేశము లేక యెత్తైనకార్యమేదియును జరుగుట లేదు. సౌఖ్యమునందిటివారిలో నెల్ల సుఖము గనినయాతఁ డితఁడే. ప్రభునకుఁ బ్రేమైకస్థానము. ప్రజల కందఱకును దైవము. తనయాశ్రయుని రాజ్యమునకు విరోధులుగా నుండువారలకందఱకును బ్రక్కలోనిబల్లెము. అతనికిఁ దీనిమనోరథము లేదు. తనయభ్యుదయంబునకుఁ దొలుదొల్త వచ్చినమేఘమాల ముందుఱఁ బోవు తేజస్సును మఱింత ప్రభావంతంబుగను, ఆహ్లాదకరంబుగను నొనరింప మార్గదర్శకం బగును గాని మఱియన్యంబు గాదనుతలఁపు లుత్పన్నంబు లయ్యెను.

అలస్తజీనున కొకకుమార్తె యున్నది. ఆమె కడుసౌందర్యవతి. ఖొరాసానుదేశమునందు బలవంతు లగుసామంతులెంద ఱెందఱో యామెయెడఁ గన్ను వైచి తత్పాణిగ్రహణం బభిలషించుచున్నవారు. ఆమె 'వారియాకాంక్షల, దరికిఁ జేరనీయకున్నది. ఆమెకున్న సహజసద్గుణంబు లిన్ని యన్ని యని కావు. అట్టిసద్గుణఖని యగునారీరత్నమునకుఁ దత్సమానసుగుణసంపన్నుని చేపట్టవలయునను తలంపు మనంబునం దుదయించుట యబ్బురమా? ఆమె తండ్రిగారితో స్నేహముచేయఁదలంచినవారినే చాల మందిని కాదనియెను. ముద్దుగుమ్మ "జహీరా" యింకను బెండ్లిచేసికొనకుండెను. ఎవ్వరువచ్చి యామెను జూచిపోయినను వారినెల్ల నిరాదరణము చేయుచుండెను. దేశమంతయు నీయద్భుతప్రశంసయే యలముకొనియెను. ఎవ్వరేమనుకొనినను ఆమె మాత్రము తన్ను వరింపవచ్చిన వారివంకఁ జూడదయ్యెను. వారిమాట వినిపించుకొనదయ్యెను. తండ్రి కీమె ప్రేమైకనిలయం బగు నేకపుత్రిక. ఆమెవలనఁ దనవంశము

నిలుచునని స్వతస్సిద్ధముగ నెన్నుకొనుచుండెను. అత్యుత్త హెచ్చయ్యెను. ఆశాభంగము మనస్సును దుఃఖమున ముంపుచుండెను. ప్రేమైకనిలయంబు తనకుమారితయభిమతంబునకుఁ బ్రతికూలంబుగఁ బ్రవర్తించుట కాతనికిష్టము లేకుండెను. ఏమిచేయుటకును గూడఁ దోఁచకుండెను.

మనఅమీరాలీఉమ్రావు కాపురము రాజమందిరమున. జహీరా కాతనిసందర్శించుట కవకాశము కలుగుచుండెను. వారియుభయులకును దఱచు సహవేశము. సరససల్లాపములు. అందువలన నన్యోన్యానురాగము జననము. ఇన్ని లభించెను. పుట్టినదకట్టి రాణివాసస్త్రీసందర్శనమే ఘనము. వారు నిరాదరణచూపకుండుట మహాభాగ్యము. అట్టిమహాభాగ్య మాతనికి లభించునట్టు పొసఁగెను. మొదటతనపోఁడువనితనూజాతయందు మంచియభిప్రాయము. పిమ్మట నామెతోడ స్నేహానుభావము. తదుపరి సన్నసన్నని మోహవికారము. చివరకు మహామోహంబుదయంబయినట్టు కన్పట్టెను. ఆమెను జేపట్ట నెట్టియొట్టి ఉమ్రావులభిలషించిరో వారల నెల్లల తాంగి తృణీకరించెనో యాతఁడెఱుంగకపోలేదు. ఆమె యెట్టివిధమువ్యవకీర్తి చేయునో యాతఁడెఱుంగును. తనహృదయంబున పొంగిపొరలుచున్న మహామోహంబున కామెగుఱియైన యాతనిమనోరథం బీడేర్చునను తలంపు వానికి సమంజసమా? అట్టియాశయైన మనంబున నుంచుకొనఁదగునా?

వారుభయుల సమావేశమగుట యసంభవము. రెండుహృదయంబులు నేకీభావంబందితొందరపోవలెనని నిరీక్షణమహాయంత్ర సామర్థ్యంబునం గాని నెఱవేఱుట పొసంగనేరదు.

మనస్సునవిజమైన యనురాగముదయించినపుడు, ఈక్షణంబుల నయ్యది విశదపఱచుచుండును. తథావిధంబగు మార్దవంబు మనోహరంబుగఁ గనుదమ్ముల వెలువడి యాతనితో సంభాషించుచున్నట్టు తెలిసికొని యాతండు సంతుష్టాంతరంగుడయ్యెను. తనయూహలు తప్పటూహలు కావని యాతనినిశ్చయము. అలప్తదీయనకు మున్నలబ్ధియగు జహీరా తనయెడ మోహావిష్టయైనదని యెంచికొనియెను. తనమనోగతభావం బాతండు నిశ్చయంబుగ బహిరంగ మొనరించెను. రెండవపక్షమున నయ్యది సంస్థాయమానంబయ్యెను. అప్పుడాతనికి మహానందంబున నొడలుపరవశమయ్యెను.

తనమోహవికారమును బయలుపఱచుచు నొకనాఁడుమనయుమ్రావు "సుందరాంగీ! నేనుమున్నొకనాఁడు బానిసనైయుంటినని సంశయమొందకుము. నన్నుజన్మించినది రాజవంశము. నీసత్కులప్రసూనత మత్సంపర్కంబువలన మాలిన్యంబుబొందనేరదు. నాదాస్యంబునకును వచ్చెడి, నశించిపోయినది. జన్మమునకుఁదగినపదవి

మనరాష్ట్రాధీశ్వరుని యనుగ్రహంబున లభ్యంబైనది. స్వాతంత్ర్యమున నత్యున్నతపదవి నందితిని.

మనోహారిణియగుజహీరా, "సామంతనాయకా! ప్రపంచయాత్రయందు మనుజులసౌఖ్యమును దమకుమార్గదర్శకులగు వారలనన్వేషించుచుపోంచె నీతివర్తనులగు వారల మనము చూచుకొనవలయునేగాని యాతఁడుచక్రవర్తియా యాతఁడునిరుపేదయా యనుమాట మనమాలోచింపరాదు. వారిస్థితిగతులనుగూర్చి మనముయోచింపరాదు. స్థితిమంతుఁడుకుదురుట సుకరము. సద్వంశసంజాతులును పేరుపెంపుగలవారును దొరకుట యైనను నంతకష్టముకాదు. పైరెండుతరగతులవారునుగూడ నాకులభ్యమైనవారు. సద్వర్తనుఁడు దొరకవలయుననిన దుర్లభము. అట్టివాఁడుసంప్రాప్తంబైన సమయమే సమయము" అనియెను.

ముద్దుగుమ్మా! నాయెడ నేసుగుణములునులేవు. నీతండ్రిగారి యాస్థానమున నిరంతరమును గొలువమరియుండు సామంతనాయకులతోఁ బోల్చిచూచిన నేనెట్టి వాఁడను గూడఁగాను. నాకును వారికిని నొక్క భేదమున్నది. అదిమాత్రము నేనెఱుంగుదును. వారికి ద్రవ్యమును ఉన్నతపదవియును దమకు తామైలభించినవి. అప్రయత్నముగఁ బూర్వజన్మసంచితమువలనఁ బుట్టుకతోడనే కలిగినవి. నేనుజన్మముచేత రాజవంశముననే జనియించితింగాని నాకుఁ గలిగిన యాకొలఁదియౌన్నత్యమునాయంత సామర్థ్యమున నార్జించికొనినది కాని అయాచితలభ్యంబుకాదు."

జహీరా పరమోత్సాహముతో "సుఖముకానిమ్ము కష్టముకానిమ్ము. నీతోడఁ గూడి యనుభవింపవచ్చినఁ జాలుననుకొంటిని. తండ్రిగారుమాత్రము వలదనకుండ నుండవలయును. నాకట్టి యభిమతమున్నను తండ్రిగారు వలదనినకార్యమును నేఁ జేయఁ జాలను. ఆఁడుదానికి భర్తయెడ నాచరింపవలయు ధర్మమునకన్న తండ్రిగారియెడఁ జేయఁదగిన ధర్మభారము హెచ్చుగనున్నది. ఒకధర్మము ననుసరింపనేరనివారు మఱియొక ధర్మము ననుసరింపఁ గలుగుదురా? అనియెను.

"నేనిప్పుడే మన యధీశ్వరుని చేరఁబోయెదను. మన పరస్పరానురాగవాంఛితంబులు దెలియఁ బల్కెదను. నామాటయనిన నాయనకధికగౌరవము. అట్టివిశ్వాసముదయించుటకుఁ గారణమున్నది. కాని యాభిజాత్యము సాంగత్యములోడ నెంత వఱకుఁ గూడివచ్చునో దాని నిప్పుడరయవలసియున్నది."

ఆదినముననే మనయమ్మారావు అలప్తజీనుని సందర్శించెను ఆతని తనుజాతయందుఁ దనకుఁ గలిగిన యనురాగమును దెలియఁబల్కెను. రాష్ట్రాధిపతికయ్యది యొకవింతగఁ గాన్పింపలేదు. కాని యాతఁడు మాత్రమిట్లనియెను. "జహీరానాకేకపుత్రి

కావిసేయుంబని నీవెఱుంగుదువు. ఆమనోహరకుసుమము పదునాఱు వసంతములు వెలిగినది. నాహృదయమునం దనుపమానందసంధాయకం బైన తనవనిర్మలసౌరభంబు నెఱపి రేకెత్తిన నట్టిజన్మం బెత్తవలదా యనిపించినది. ఆమె కేవిధమైన కష్టమును లేకుండఁ జేయుట నామనోవాంఛితంబు. అదియనాకుఁ గర్తవ్యంబు. ఆమె నిది వఱకు నలుగురు రాకుమారులు పాణిగ్రహణ మొనరింప జాబంపినారు. వారి కందఱకును విశేషమైన రాజ్యమున్నది. అధికారసామంతమున్నది. అట్టి వారి నందఱఁ దృణీకరించినది. ఈయాస్థానమునందలి సామంతు లెందఱో యామెచేఁ బట్టఁదలంచిరి. వారికిని నట్టి విజయమే కలిగినది. అట్టి పరమపావనంబగు విషయమున నేను పాతకము వహించువాఁడను గాను. ఆమె నిట్లు చేయుమని చెప్పువాఁడను గాను నాయంగీకారమునకన్న మున్నుగ నామె యభిమతమును గైకొనవలయును." అనియెను.

"నాహృదయ వికారమామెకెఱింగించితిని. భవత్కుమారీరత్నము నాయుద్దేశములను గ్రహించి దయచూపెను. ఇంక మీయంగీకారమొక్కటియే యాటంకముగ నున్నది. మీయనుబంధమును మీరంగీకరింపరేని నాజీవనము నేఁటితోడ ముట్టమగును."

"ఆమెయంగీకారముఁ బడసియుంటివేని నాయంగీకారమునకుఁ గొఱంత యుండదు. సర్వాత్మకుండును సర్వనియంతయునునై వైవాహికానుబంధసూత్రధారుండై వెలయుజగత్పతి మీయనుబంధము నాచంద్రతారార్కముగ వెలయఁజేయుఁగాక. ఆమె యెట్టకేలకుఁ దగినవానిని వరించినది. నామనస్సునకు సంతుష్టియైనది."

పాణిగ్రహణ మహోత్సవమును తోడ్తోన మహావైభవముతో జరిగెను. దశము వేసి పుట్టినయా పెండ్లికొమరుని జూచిన నిష్ఫలప్రయత్నులైన సామంత వీరులకుఁ గొందఱ కసూయ మనస్సున నారాటము కల్గించెనుగాని ఖొరాసాన్ దేశమునందలి తక్కంగల జనముల కందఱకు నీపరిణయ మహోత్సవంబున నమందానందం బుదయించెను. ఈవివాహమైన కొలందికాలమునకే "అబ్దుల్ మల్లిక్ సుమణి" యను నరపతి మరణించెను. ఆతఁడు ట్రాన్సాక్సాని యాదేశపాలకుఁడు. సామంతవీరులందఱును తద్దేశపాలనమునకుఁ దరువాతవాని నొకని నియమింపుఁడని ఆలప్తజీనునకు విన్నవించిరి. సుమణివంశము మిక్కిలి సామంతమైనది. వారిక్రిందనప్పుడు బహురాష్ట్రములున్నవి. రాజులు బొఖారా దేశమున కొలువుతీర్చిరి. మన్సూర్ అను రాజకుమారుని తరువాతిపాలకునిగా నియమింపుఁడని వారందఱును తీరుమానించిపంపిరి. అందుల కాలప్తజీనంగీకరించినవాఁడుకాఁడు. ఆతఁడు కడు చిన్నవాఁడని చెప్పి! త్రోసిపుచ్చెను. ఆతనికిఁ బితృవ్యుం డప్పటికి పరిపాలనము స్వీకరించి యాధిపత్యము నెఱప నొప్పికొనియెను.

ఈప్రత్యుత్తరము రాజధానికిఁ జేరువఱకు కొందఱు సామంతులు సమ్మేళకట్టి మన్సూరును సింహాసనమున కెక్కించిరి. అందుపైన నాపనివాఁడగు రాజకుమారుఁడు అలప్తజీనుని తన యాస్థానమునకువచ్చి దర్శనముచేసికొమ్మని వర్తమానమంపెను. అందువలన నేదియో ముప్పవాటిల్లునని యెంచి యప్పటికేదియో సమాధానము చెప్పి పంపించెను. క్రీ. శ. 962 సంవత్సరమున అలప్తజీను తగిన బలములను ప్రోగుచేసికొని గజనీదేశముపై దాడివెడలెను. తనయల్లుని పరాక్రమ విశేషంబున నావండయాత్ర యందు విజయము నందెను. అచ్చట నొక స్వతంత్రరాజ్యమును స్థాపించెను.

మన్సూరున కిది తెలిసెను. ఖొరాసా రాజ్యపరిపాలనము తన యాస్థానము నందలి సామంతు నొకనియధీనమందుంచి అలప్తజీనుని పట్టుకొన సైన్యములనంపెను. తనజామాతృపరాక్రమసాహాయ్యంబున శత్రుసేనలన్నియును మడిసెను ఈవిజయమువలన నాతని సైన్యముల కాతనియందు మఱింత విశ్వాసముకుదిరెను. అతనిసైన్యము లెచ్చటకుఁ బోయినను విజయమే. మన్సూరు బలము సన్నగిల్లెను. అతఁడు, రాజ్యసంరక్షణ మెట్లోయని గడగడ వడంకెను.

పదునేనువత్సరములు అలప్తజీను తనస్వాతంత్ర్యమును నిలుపుకొనియెను. అతఁడు తఱచుగా హిందూదేశముపై దండయాత్రల సలిపెను. అన్నింట నాతనికిఁదప్పకుండ విజయమేకలిగినది. అతఁడు చిరకాలము రాజ్యముచేసి వయోవృద్ధుండయ్యెను, 975 సంవత్సరమున మృతుండయ్యెను. ప్రజలందఱు నత్యంత దుఃఖార్తులైరి. అతని కుమారుఁడాతని తరువాత "అబూ ఇసాకీ" అనునాతఁడు రాజ్యమునకు వచ్చెను. అతఁడు సింహాసనమునకు వచ్చినతోడనే తనశ్యాలకసమేతుండై బొఖారాపట్టణముపై దాడివెడలెను. మన్సూరు, అబూఇసాకును జక్కఁగ సన్మానించెను. గజనీరాజ్యము నాతనికి వరుమానముగ నొసంగెను. అతనిసేనానియగు మనపాంధునిగూడ నాతని బావమఱఁదిక్రిందఁ బ్రతినిధిగ నియమించెను.

ఈసంగతి జరిగిన వెనుక అబూఇసాకు విశేషకాలము జీవింపలేదు. అందుసామంతులు తక్కుంగలనాయకులును గూడ నేకగ్రీవముగ మనపాంధునిరాజుగా స్వీకరించిరి. స్వప్నము ఫలించినది. బానిసయగువాఁడు రాజ్యమున కధీశ్వరుఁడయ్యెను. అధీశ్వరుఁడగుటలో మిక్కిలి ప్రబలమైన యధీశ్వరుఁడయ్యెను. ఈతఁడే సభక్తజీన్, హిందూదేశమును మొదట జయించిన మహమ్మదు గజనీకి తండ్రియితఁడే.

---

